

# శ్రీ కృష్ణాష్టకమ్

వసుదేవసుతం దేవం, కంస చాణూర మర్దనం
దేవకీ పరమానందం, కృష్ణం వందే జగద్గురుం॥ 1

వసుదేవుని కుమారుడు, దేవదేవుడు, కంసచాణూరులను వధించినవాడు, దేవకీదేవికి పరమానందమును గూర్చిన వాడును అగు జగద్గురువైన శ్రీ కృష్ణ పరమాత్మకు నమస్కరించుచున్నాను.

అతసీ పుష్ప సంకాశం, హారనూపుర శోభితం
రత్నకంకణ కేయూరం, కృష్ణం వందే జగద్గురుం॥2

అవిసిపువ్వువంటి ఆకారము కలిగినవాడును, కంఠ హారములతోను, అందెలతోను, హస్తాభరణములతోను శోభించే ఆకారము గల జగద్గురువగు శ్రీ కృష్ణపరమాత్మకు నమస్కారము.

కుటిలాలక సంయుక్తం, పూర్ణచంద్రనిభాననం
విలసత్కుండల ధరం, కృష్ణం వందే జగద్గురుం॥ 3

వంపులు తిరిగిన ముంగురులతోను, రత్న కుండలములతోను, పూర్ణచంద్రునివంటి మోముతో ముద్దులొలికెడి జగద్గురువైన శ్రీ కృష్ణ పరమాత్మకు నమస్కృతులు.



మందార గన్ధ సంయుక్తం, చారుహాసం చతుర్భుజం
బర్హి పిఞ్ఛావ చూడాంగం, కృష్ణం వందే జగద్గురుం ।4

మందారపుష్ప పరిమళముతో నిండినదియు, చతుర్భుజములను కలిగినదియు, నెమలిపింఛముతో విలసిల్లు దివ్యదేహము గల జగద్గురువగు శ్రీ కృష్ణ పరమాత్మకు వందనములు.

ఉత్ఫుల్ల పద్మ పత్రాక్షం, నీలజీమూత సన్నిభమ్,
యాదవానాం శిరోరత్నం, కృష్ణం వందేజగద్గురుం । 5

పద్మపు రేకులవంటి విశాలనేత్రములతోను, నల్లని మేఘమువంటి శరీరకాంతితోను కూడినవాడై, యాదవులందరికి శిరోభూషణమువలె ప్రకాశించు శ్రీ కృష్ణ పరమాత్మకు నమోవాక్కులు.

రుక్మిణీకేళి సంయుక్తం, పీతాంబర సుశోభితం
అవాప్త తులసీగంధం, కృష్ణం వందే జగద్గురుం । 6

పీతాంబరధారియు, తులసిమాలను ధరించి దాని పరిమళముతో నిండిన దేహమును కలిగి, రుక్మిణీ దేవితో క్రీడ సలుపు జగద్గురువగు శ్రీ కృష్ణ పరమాత్మకు వందనములు.

గోపికానాం కుచద్వన్ద్వ, కుంకుమాంకిత వక్షసం
శ్రీనికేతంమహేష్వాసం కృష్ణం వందే జగద్గురుం॥7

గోపికలను ఆలింగనము చేసికొను సమయంలో వారి

స్తనద్వయమునందున్న కుంకుమతో చిహ్నితమైన విశాల వక్షస్థలం కలవాడును, సంపదలకు నిలయమైనవాడును అగు జగద్గురువైన శ్రీ కృష్ణపరమాత్మకు నమస్కారము.

శ్రీ వత్సాంకంమహోరస్కం, వనమాలావిరాజితం
శంఖచక్ర ధరం దేవం, కృష్ణం వందే జగద్గురుం॥ 8

"శ్రీ వత్సము" అనెడి పుట్టుమచ్చ కల తన విశాల వక్షస్థలముపై వనమాలను ధరించినవాడును, శంఖచక్రములు ధరించిన కరములు కలవాడును అగు జగద్గురువైన శ్రీ కృష్ణ పరమాత్మకు నమస్కరించుచున్నాను.

కృష్ణాష్టక మిదం పుణ్యం, ప్రాతురుత్థాయః పఠేత్
కోటిజన్మ కృతం పాపం, స్మరణేన వినశ్యతి॥ 9

ఫలశ్రుతి :- పుణ్యప్రదమైన ఈ కృష్ణాష్టకమును ప్రాతఃకాలమున లేచి శుచిగా పఠించువానికి కోటిజన్మలలోని పాపము నశించును.



# శ్రీ కృష్ణాష్టకం

వసుదేవ సుతం దేవం కంస చాణూర మర్దనమ్ ।
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

అతసీ పుష్ప సంకాశం హార నూపుర శోభితమ్ ।
రత్న కంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

కుటిలాలక సంయుక్తం పూర్ణచంద్ర నిభాననమ్ ।
విలసత్ కుండలధరం కృష్ణం వందే జగద్గురమ్ ॥

మందార గంధ సంయుక్తం చారుహాసం చతుర్భుజమ్ ।
బర్హి పింఛావ చూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

ఉత్ఫుల్ల పద్మపత్రాక్షం నీల జీమూత సన్నిభమ్ ।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

రుక్మిణీ కేళి సంయుక్తం పీతాంబర సుశోభితమ్ ।
అవాప్త తులసీ గంధం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

గోపికానాం కుచద్వంద కుంకుమాంకిత వక్షసమ్ ।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితమ్ ।
శంఖచక్ర ధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్ ॥

కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
కోటిజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి ॥